# అభినవసరస్వతి

[ మాసపత్రిక ]

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరు.

సంపుటము 33 | 1941 సం॥ జూన్ నెల 15 వ తేది | సంచిక 3

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు 5 0 0 |
| పోషకులకు | 10 0 0 | చందాదారులకు | రు 8 0 0 |

Printed at the Chandrika Press, Guntur,
and published at Guntur by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

# రాజపోషకులు.

శ్రీమంతు, రాణీ ఆదిలక్ష్మీదేవమ్మ బహదరుగారు,
గద్వాలసంస్థానము.

## ప్రధానపోషకులు.

౧ శ్రీశ్రీ జగద్గురు సచ్చిదానందాభినవశంకరభారతీస్వాములవారు, హంపి.

౨ శ్రీశ్రీ జగద్గురు, అభినవోద్దండ విద్యాశంకరభారతీ స్వాములవారు, పుష్పగిరి

౩ తంగెడ నరసింహారావుగారు, కరణము, మోర్జంపాడు.

౪ ఆర్. రామారెడ్డిగారు, దైవముదిన్నె.

౫ రాజా సురభి వెంకటరత్నాంబ బహదరుగారు, రాణీ, ఆఫ్ జటప్రోలు, కొల్లాపురము.

౬ శ్రీశ్రీ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి.

౭ రాజా రఘునందనసింగుగారు, నెల్లుట్ల.

౮ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురము.

౯ రామచంద్రారెడ్డి దేశముఖుగారు, ఇనుపూరు.

## పోషకులు.

౧ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు.

౨ రాజా కంచుపూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు జమీందారుగారు - జేవిడి

౩ కాండ్రి వెంకటకృష్ణారెడ్డి దేశముఖుగారు, బసవాపురము.

# అభినవసరస్వతి

సంపుటము 33 | వృషనామసంవత్సరము జ్యేష్ఠమాసము | సంచిక 3

## కృతివిమర్శనము

**మహాభారతరహస్యము.**

ఇది శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రిగారిచే విరచితము. జయపురసంస్థానాధీశ్వరులును సాహిత్యసమ్రాట్ప్రముఖ బిరుదాంచితులును విద్వత్కవులును వదాన్యులును నగు శ్రీ విక్రమదేవవర్మగారికిఁ గృతియీయఁబడినది. పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్రాసిన మహాభారతచరిత్రపై నిది విమర్శనము. అమ్మహాభారతచరిత్ర పండితులకే కాక పామరులకును బఠింపఁదగని పాపప్రవృత్తులతోఁ బరిపూరితము. అద్దాని ననేకులు విమర్శించి యున్నారు. అందీమహాభారతరహస్యముగూడ నొకటి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు సంపూర్ణసంఘసంస్కరణ ప్రియులు; సూర్యనారాయణశాస్త్రిగారు యత్కించిత్సంస్కరణ ప్రియులు. పాండవదిగ్విజయాది బహుభాగములు వారిదృష్టికిఁ బ్రక్షిప్తములుగా, ద్రౌపదీ వస్త్రాపహరణాది స్వల్పభాగములు వీరిదృష్టికిఁ బ్రక్షిప్తములు. కాంగ్రెసులీడరు. గాంధిగారి శిష్యుఁడు. అట్టిసంస్కరణపరమైన యంశములు వదలినను నీవిమర్శనములో గ్రహింపఁదగిన విషయము లెన్నియో యున్నవి. గ్రంథము చాల బాగుగానున్నది. అందువలన నది యభినవసరస్వతీపాఠకు లవశ్యముగా నవగతముచేసికొనఁదగినవని యస్మదభిప్రాయము. కనుక నాయాయిప్రకరణములలోని యాయాయిభాగము లావశ్యకమైనంతవఱకు నపుడపు డభినవసరస్వతి వెల్లడింప వేడ్కపడుచున్నది. చూడుఁడు.

## సంస్కరణములు

...ఈ కాలమునందు నవనాగరికులలోఁ గొందఱు మతము మతనిబంధనలు నెంతమాత్రము పనికిరావనియుఁ దేశవిప్లవమునకు రాజకీయవిప్లవమునకుఁ గారణము లగుననియుఁ జెప్పుచున్నారు. కాని యీయభిప్రాయ మెంతమాత్రము యుక్తమైనది కాదు. మతము మతాచారానుకూలమైన నిబంధనలు లేనిచో నాస్తికత ప్రబలిపోవును. అపుడు పురుషకారమునకుఁ దప్ప దైవమునకుఁ దావు లేదు. దైవమునకుఁ దావు లేనిచోటఁ జిరకాలము శాంతి నిలువదు. కాన శాశ్వతమైన ప్రపంచకల్యాణమునకు మతాచారములు ముఖ్యములు...పూర్వపురుషులచేతఁ బూర్తిగా విచారింపఁబడి స్థాపనచేయఁబడిన మతాచారధర్మములకంటె నుత్తమముగా నిఁక స్థాపింపలేరని నానమ్మకము...పూర్వాచారపరులగు పండితులు శాస్త్రములను జక్కఁగాఁ బరిశీలించి...పురాతనవిషయములను బునరుద్ధరించుట కు...దాహరణములు చూపింపఁగలరు.... ఇఁక నవనాగరికులో? తమదృష్టికి గోచరమైన ప్రకృతియే పరమేశ్వరుని సర్వసృష్టిరంగమనియు దానికి వెలుపలఁ బ్రపంచమే లేదనియుఁ దమ మనస్సున కెంతవఱ కేది తోఁచునో యదియే సిద్ధాంతమనియుఁ దలంచుచుఁ దమ కడ్డుచెప్పినవాని నెటువంటివానినైనను దృణీకరించుచు

సాంప్రదాయసిద్ధాంతములైన వాక్యములం జెప్పుచున్న పూర్వాచారపరులైన పండితుల ...నిందించుచున్నారు. శాస్త్రములప్రక్క వీరి కంథకారబంధురముగానున్నది ..భరింపరాని విద్యాక్లేశమున కోర్చి శాస్త్రములం జదివి సాధ్యమైనంతవఱ కనుశ్రుతముగా వచ్చుచున్న జాతివిహితమైన యాచారధర్మముల...నిర్వర్తించుచున్న పూర్వాచారపరులను బుద్ధిహీనులని... నిందించుచున్నారు...

ఇట్టిగ్రంథములోని చాలపంక్తులు సనాతనధర్మానుకూలములై కనంబడుచున్నయవి. అట్టి మహోపకారభాగములచే నభినవసరస్వతి నలంకరించి పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారిచే బిట్టు తిట్టఁబడిన వ్యాసపాండవాదుల వాస్తవస్వరూపమును వలనైనంతదూరము తెలియఁబఱుపఁ దలఁచియుంచెని. శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రిగారిందుల కిష్టపడుట కీద్యమానులు.

---

## —♦ పోతరాజుగారి క్త్వార్థక ప్రయోగాలు ♦—

(శతావధాని శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు)

ఉ. ... పిన్ననాఁటనుండేనియు మాధవుఁ డిన సహింపఁడు.

చం. ... ఎఱింగెఱింగి నావలువిది

వీనిలోఁ గ్త్వార్థకసంధి స్పష్టముగాఁ గనఁబడుచున్నది. ఇక్కడే కాదు. మఱి కొన్నిచోట్లనుగూడఁ బోతరాజుగారీసంధిని జేసియున్నారు. ఈయనయే కాదు. పిల్లలమఱ్ఱివారెన్నిచోట్లను జేసియున్నారు. తిక్కన్నగారి యందిచ్చుప్రయోగము నన్యథాగా నిటీవలివారు సమర్థించినారు కాని లేకపోయిన వారును నీసంధి చేసినవారే, పరమాచార్యులు నన్నయభట్టుగారుకూడఁ జేసినవారేయని యెల్లపనులు నెఱింగించిపుడే యన్న పాఠము నెఱింగించి తగక, అని యెవరో మాటదక్కించుకోకపోయిన మనము చెప్పుకోవచ్చును. అడిదము సూరకవిగారినాఁటి కీపెద్దుఁబాటు జరగలేదని యతని లక్షణగ్రంథమువల్ల గోచరించుచున్నది. శ్రీనాథునికంటెఁ బిల్లలమఱ్ఱి కొంచెము పెద్ద. శ్రీనాథపోతరాజులు సమకాలీనులు. పిల్లలమఱ్ఱికూడ సమకాలీనుఁడే యనుకోవచ్చు. అప్పటికింకను నీ క్త్వార్థకసంధివిషయములో నస్తినాస్తివిచికిత్స పుట్టనేలేదు. అప్పటికే కాదు. విజయవిలాసమునాఁటికిఁ గూడ ననుకోవచ్చును. కనుకనే చేమకూర యిటువాపటు నటుచూపిటు వగైరాలు ప్రయోగించుకొన్నాఁడు. పాపము. ఆయీప్రయోగాలలో నెల్లఁ బూర్తిగా రూపుమాపఁబడినది నన్నయ్యగారిదే. ఆయన ప్రయోగించుకొన్నాఁడు. క్త్వార్థకసంధినొప్పుకొనెడివాఁ డప్పకవియుఁ గాఁడుకాని యతఁడు మఱియొకదాని కుదాహరించిన పద్యములో నున్నది చూడుఁడు.

తే. దొంగవలెవచ్చి యిచ్చట డొంగినావ
దేమయా బావగారు! పెద్దామె కోప
గించినందులకా? బళా! మంచివాఁడ.
వేమనందును ముసలామె పెయ్యే నివేకి.

ఇందులోనున్న పెద్దా యకారసంధియనుచు నాక్షేపించెడివా రిప్పు డున్నారు. అప్పకవి కాలాటి సందేహ ముండియుండదు. వివేకి వివేకినిగా నుండవలసినది కాని లోకసామాన్యముగా నాలాగు ప్రయోగించఁబడినది. మార్గాంతరముచేత సాధింపఁ బడుచో సాధింపఁబడెడిది యనుకొందము. ఏమనందునన్న క్త్వార్థకసంధికి గతియేమి ! ఇష్టములేనివాఁ డేమియందును మసలామెయని దిద్దరాదా ? దిద్దను లేదు. ఇఁక నచ్చు పొరఁబాటుపాట పాడవలె. పాపాలకెల్ల భైరవులు వాండ్రే చాలమందికి గతి. ఆలోచించిన నేమనందును మసలామెపాఠములోనున్నంత సుఖ మేమి యందునులో లేదు. అందుచేత నాసంధి పొడకట్టక యట్టె పెట్టియుండవచ్చుననుకొన్నను ననుకోవచ్చును. బుద్ధిపూర్వకముగా నేను నాకవిత్వములో నెక్కడను 65 వత్సరాల వయస్సుదాఁకఁ గ్త్వార్థకానకు సంధి చేయనే లేదు. శ్రీ జయపురము మహారాజావారి పద్యాలలోమాత్రము బుద్ధిపూర్వకముగా ముంచెత్తిరకా, అనికాఁబోలు 66వ వత్సరములోఁ బ్రయోగించి టిప్పణిలోఁ బిల్లలమఱ్ఱి ప్రయోగమాలిక నుదాహరించినాను. అయినను నాక్షేపించెడి వారు మానలేదు. భవతు. తెలియకుండ శ్రవణానందములో నెవ్వరుగందురో, మఱియు నెవ్వరువిందురో, ఏమనందురోయని పద్దవి. దీని నిప్పుడు దిద్దియున్నారో యేమో ? దానినిజూచివ్రాసెడివారికి యిది కాదు. నాజీవితకాలములోనే నాకవిత్వము, కవిత్వముమాత్రమే కాదు, నావంశచరిత్ర నాకళాప్రపూర్ణబిరుదప్రాప్తిలోనైన వన్నియుఁ దారుమారుగా మార్చివేయుచున్నారు కొందఱు. దీనినిగూర్చి గోదేవిలోఁ గొంచెము వ్రాసినాను. నా యసమర్థత్వమునుబట్టి యితరులు ప్రాఫుప్పిద్దుటవల్ల నానారీతులను మాఱిపోవుచున్నది. కొన్నిచోట్ల ననిన, తత్తథాస్తామ్.

అనసులసంటికా, కెఱుఁగవే వగయిరా స్థలములలోఁ దప్ప నీక్త్వార్థకసంధి చాల సుఖముగానుండెడి స్థలములు కొన్నియున్నవి. ఏమనందు సుఖముగానుండెడిస్థలమే. ఇంకను దీనినిగూర్చి వ్రాయవలె. వెనుక నేమిపదమున్నప్పుడే గాని యందము కనఁబడియెడిని గాని యదిలేకపోయిన డాకురేకు పోయిన యుద్ధములా గుండఁగలదు. అందు చేతఁ గేవల మనందునో బాగుండదు. ఈస్థూలసూక్ష్మ మెఱింగి దీనిని వాడుకోవచ్చును. ఇప్పుడు దిద్దిన దిద్దుఁబాట్లవల్లఁగాని లేకపోయిన దీనికి నన్నమాముల సమ్మతి పూర్తిగా నున్నది. అహోబలుఁడుకూడఁ గొంచెము మెత్తఁబడి సుముఖముగాఁ గొన్నిమాటలు వ్రాసియున్నాఁడు. నేను బుద్ధిపూర్వకముగా వ్రాసినదియుఁ బ్రవాహతిక పద్దెదియు నుదాహరించియే యున్నాను. ఇఁక నేను జేయవిదాంవి జేసినట్టుపోల్చి నన్ను నిందించిన దానిఁ గనఁబఱచి మఱొకవిషయ మందుకొందును.

ఎఱుఁగుం డేనొనరింపఁగా, అని జయంతిలో మధ్యమపురుషబహువచనముగాఁ బ్రయోగించుకొన్నాను. అచ్చువారుకూడ నెఱుఁగుం డేనొనరింపననియే ముద్రించి నారు. ఆక్షేపకులో? దాని నెఱిఁగుం డేనొనరింపనని దిద్ది ఎఱిఁగి, ఉండి, ఏను, అని విడఁదీసి యొకటికాదు, రెండుక్త్వార్థకసంధు లనుచుఁ బ్రచురించినారు. చిత్తగించి నారా ? నే నెంతలోకువగా నున్నానో యాక్షేపకులకు ? దానితోపాటే డిల్లీకిడిల్లి

వినన్ లేదొకొ దేశికుల్, వృథగదా వెంకన్ననున్ నవ్వుటల్, అన్న పద్యములోనున్న వెంకన్ననున్, అన్నది వెంకన్ననున్ వెంకన్ ననున్, అని విడఁదీసి చదువుకోవలసినదని నేను టీకలో మొఱపెట్టుకొన్నప్పటికిని దాని ననాదరించి యతి పోయినది, రక్షరేకు కట్టుకోవలసినదని శాసించినారు. ఇదంతయు నాలోఁకువే కాని యావలివారి ప్రమాదము కాదని భావించుచున్నాను. ఎక్కడను యతియుఁ బోకుండను ప్రాసయుఁ బోకుండను గవిత్వముచెప్పఁగలనఁటకాని యేమియు నవసరములేనిచోట్లఁగూడ నాక్షేపించినవే కాని సంఖ్యాపూర్తి కాదనెడి తాత్పర్యముతో నాక్షేపకు లిన్నివిధములఁ బరిశ్రమ చేయుచున్నారని లోకానకుఁ దెల్పుటకే నే నీ కొంచెము వ్రాయవలసివచ్చినది. ఇంకొకప్రయోగమునుగూర్చి వ్రాసెదను.

పెంపుదీపింపఁ దన్ను నుతింపుచుండ. ఇక్కడ నుతింపుచు నన్నది ప్రాసస్థానములో నున్నది. కొందఱు నుతించుచుఁ దప్ప నుతింపుచు నుండదని వాదించెదరు. దీనినిగూర్చి సర్వలక్షణసారసంగ్రహములోఁ జూడవలసినదని వదలిపెట్టెదను. నడుచు ధాతు ప్రేరణరూపము నడుపుననియే కాని నడిపించు నుండదనియు నీకోసము, నీకోసరము ఈరూపద్వయము లేదనియు సంఖ్యాపూరణమునకు శంకించెడి వ్రాఁతలు పూర్తిగా నుపేక్షించిననే తప్ప నీవ్యాసము తేలునట్టు లేదు. నడిపించులు భారతములో డెబ్బైపదకొండు. ఆక్షేపకుల రచనలో ? తొంభైపదకొండు. కోసము కోసరము లప్పకవీయములోనే కాక శ. ర. నిఘంటులోఁ గూడఁ గలవు. ఇఁక నందచందములను నవి వ్యాకర్తలచే నుదాహరింపఁ బడి మహాకవులచేఁ బ్రయోగింపఁబడి యున్నప్పటికిని దానిని మొదటఁ గాదని ప్రమాదపడి యాప్రమాదము సవరించుకొనుటకుఁ గుజ్జిగాడిదలన్నది స్వకపోలకల్పితముచేసి యిదికూడ సాధువేనా యనెడి శంక. నన్నయ్య భారతములోఁ గద్రూశబ్దమునకుఁ గద్రువయని తత్సమరూపము వ్రాసినాఁడు. దానినిబట్టి వ్యాకర్తలు దానికొసమొక సూత్రమును బెట్టికొన్నారు. దానిమాదిరిని వధూశబ్దమునకుఁగూడ వధువ యని చేసుకొనెదమనిన వద్దనేది యెవఁడు ? అలాగే యందచందములనెడిదానినిబట్టి గుజ్జిగా డిదలు ప్రయోగించుకొనుచో మాయభ్యంతరము లేదనియే సమాధానము. ఈలాటిదే రాముఁడనుటకు రామ్డనెడిది ప్రయోగించి తద్ద్వారమునఁ బ్రశ్నించుటయుఁ దత్సమశబ్దగతమైన యుకారానకుఁ గోటులు కోట్లు తప్ప నితరులు లోపముచేసి యెవరుప్రయోగించినారో చూపికాని యాప్రశ్న యడుగుట కధికారమే లేదనియు విన్నవించవలసి వచ్చినదని చింతించెదను. నే నెక్కడను వాడినట్లు జ్ఞాపకము లేదు. నడిపించును గూర్చి వ్రాయుచు స్వవిషయము కొంత ప్రసక్తానుప్రసక్తముగా జ్ఞప్తికి దగిలి వ్రాసినానే కాని యిది భాగవతప్రయోగాలకు సంబంధించినది కాదు.

ఎందుకును గొఱగాని ప్రశ్న లెత్తుకొనిన గ్రంథము మఱియుఁ బెరిఁగెడిని. అందుచేత నాలాటివి శంకించఁబడ్డవి దీనిలోఁ గాకపోయినను నిరత్రయైనను గొన్ని యున్నను వాని నుపేక్షించెదను. మరుని జూపుదుగాదె క్రమక్రమంబునన్. ఇది దశమములోదే. గోపిక లనెడి మాట. సరియైనబుద్ధితో నన్వయించుకొనిన నిబ్బంది లేదు కాని

లేకపోయినఁ గొంచె మశ్లీలమనుట కవకాశము లేకపోలేదు. సరిగా న్యా[illegible] పద్ధతిని సర్వత్ర సుప్రసిద్ధమై యాడవాండ్ర నోటినుండియు మగవాండ్ర నో[illegible]నుండియుఁ జిన్నలనోటినుండియుఁ బెద్దలనోటినుండియుఁ బండితుల నోటినుండియు పామరుల నోటి నుండియు నిరాఘాటముగా వాడఁబడిన వాడఁబడుచున్న వాడఁబడఁబోవుచున్న మనుగుడుపుపదముకూడ నశ్లీలమని జాబితా పూరించెడి యీకాలములో నశ్లీలము కానిదేది ? మరునిజాపునన్న చోట నేదో మనస్సులోఁ బెట్టుకొని యాచూపుధాతువులో నన్వయించుకొనుటయో లేకపోయినను గురుశబ్దమున కసలున్న ముఖ్యార్థమును జెప్పక లక్ష్యార్థమును జెప్పుటయో చేసినఁ దప్పు నశ్లీలము రాదు. మనుగుడుపులో నాలాటి లక్ష్యార్థము చెప్పకుండ మను, మన్ను (మృత్తిక) కుడిపియనెడి ముఖ్యార్థమునే చెప్పి తప్పుటభిప్రాయమును గల్పించినందుకు సంతసింపవలసియే యున్నది కాని నూపద్ధతిని బ్రతివానికూతురి పెండ్లి యనంతరమును నల్లుని మనుగుడుపునిమిత్తము తీసికొనివచ్చుట మానుకోవలెనేమో ? ఈశంకించెడివారికి భూభుజులు (రాజులు)లో భుజపాలనాభ్యవహారయో రనెడి ధాతువుమాట తెలియదు. తెలిసిన నీదోష మక్కఱమాత్రము తగులదా? అందుచేతఁ బెండ్లిండ్లనుచు నల్లుండ్రనుచు వాండ్రను బెండ్లిజరిగిన క్రొత్తలో లాంఛనముగాఁ దీసికొనివచ్చుటయనుచు నుండినన్ని నాళ్ళు మనుగుడుపుపదము భాషలోనుంచి తొలఁగింపఁబడదు. కూఁతుండ్రతోపాటు నల్లుండ్రతోపాటు నీపద ముండెడిదే. వాండ్రకు మన్నె కుడుపనిండు, దాని కామోదించెడి వాండ్రేయని సమాధానము. ఈయిబ్బంది యనిన నల్లుండ్రతోడను గూఁతుండ్రతోడను నుండెడి సంబంధమున్న వాండ్రకేలాగును దప్పదు. అదిలేని కేవల శుద్ధ లింగీ లింగఁడు గృహస్థులుకూడ నీపదమును వదలిపెట్టరని చెప్పుచుఁ బ్రతివాదుల యవయవార్థము సరియైనది కాకపోయినను నభ్యుపగమ్యవాదమును బురస్కరించుకొని దానికే సమ్మతించుచుఁ జమత్కరించుచున్నాను.

“మను” అనిన మన్నుగదా ! మంచిది, అలాగే యొప్పుకొని సమన్వయింతము. అల్లుండ్రకత్తవారు పెట్టెడి పిండివంటలలో మృద్వికారముగాని వేవైనను నుండఁగలవా ? ఉండవు. కనుక వాచారంభణం వికారో నామధేయం, మృత్తికేత్యేవ సత్యమనెడి యుపనిషద్వాక్యము ననుసరించిన యీ యస్తవ్యస్తపు నూశంకనుగూడ నంగీకరించిన వచ్చెడి చిక్కేమిటో ? ముఖ్యముగా నిఘంటుకార్యస్థానము వారి నాలోచించవలసినదని యెవను. వారు మనుగుడుపుపదముదాఁక నింకను నిఘంటువు రచించియుందురేమో కాని ప్రచురించినట్లు లేదు. అందులో వారీపదమున కవయవార్థమనుచు వ్రాసెడియెడల నిదికూడఁ బరిగ్రహింతురనియెడి నమ్మకముతో నింతగా వ్రాసినాను. కొన్నిటి కవయవార్థా లున్నట్లు కనబడుటయే కాని చెప్పవలసిన ప్రసక్తి యుండదు. ప్రవీణాదిశబ్దము లాలాటివే. ప్రస్తుతపు మనుగుడుపుకూడ నాలాటిదే యేమో ? లేదా ? సంస్కృతములోనుండెడి మనుశబ్దము కాక తెలుఁగులో వివాహమునకు నిమ్నజాతులలో వాడఁబడెడి మనువనెడి శబ్ద మున్నది. బహుశః మనుగుడుపులో నుండెడిది యీబాపతే కావలె. ఇది సరియైన యూహయే యగుచో వివాహమునకు సంబంధించిన విందని దాని పరినిష్ఠితా

ర్థము కావలసివచ్చెడిని. భవతు. ఈలాటి వెన్నియర్థములు చెప్పినను బూర్వపక్షకర్త చెప్పెడి మన్నెక్కడికిఁ బోఁగలదు? అది యాశ్రయించియే యుండెడినిగా! పూర్వపక్ష మునుచుఁ జేయుట చేతనే యగుచో నది యాత్మ కనుకూలించెడిదిగాను నెదిరికి వ్యతిరేకించెడిదిగాను నుండున ట్లాలోచించి చేసిన దానినిగూర్చి కొంచెమైనను నాలోచించవలసివచ్చెడిని.

ఈలాటివి పూర్వపక్షములు కాఁగలవా? సుప్రసిద్ధపండితగోష్ఠివల్లఁగాని యిట్టి యజ్ఞానాలు పోవు. అందుకే కవికిఁ బండితమండలీశుశ్రూష యుండవలెనన్నాఁడు జయదేవుఁడు. కాండః పండితమండలీపరిచయః ఇక్కడఁ బరిచయశబ్దమునకు శుశ్రూషయే కాని యేబజారులోనో యేగుచున్న పండితులను జూచి యేమాటలో మాటలాడుకొనుట కాదని వ్యాఖ్యానించుచు మనుగుడుపుపదమునకు నిఘంటుకార్యప్రవర్తకులలో శిరోమణులు కనుక శ్రీజయంతిపంతులుగారు వారిని నా సమన్వయ మెట్లున్నదని ప్రశ్నించుచు మఱియొకప్రసక్తిలోకి దిగుచు మరల దానినిగుఱించియే రెండుమాటలు వ్రాసెదను.

మనుగుడుపుపదము నిర్దుష్టమే యైనను దానిలోనుంచి వట్టిని దీసికొనివచ్చుటవగ యిరా ప్రయత్నమునకు ఫలమేమి? ప్రయోజన మనుద్దిశ్య నమందోపి ప్రవర్తతేకదా యనిన వినుఁడు. లోకోత్తరమైన పేరుప్రతిష్ఠలతో నిండియుండుటయె కాక విద్యావయోవృద్ధత్వము కలిగియుండుటయే కాక మహదైశ్వర్యసంపత్తితోఁ దులఁదూఁగియుండుటయే కాక యెవరెన్ని తిట్లుతిట్టినను మాఱుచెప్పుటకుఁగాని లేశమును గలిగించుకొనని యౌదార్యముకల యొకానొక యుత్తమపురుషుఁడు న్యాయదూరమైన తను పాండిత్యాన కనుకూలించ లేదనెడి కారణముచేత నాయనను దూషించుటయే దీనికి ఫలితము. దూషించెదరు సరే. దూషణ లేకుండ మృదువుగాఁ వ్రాయుట యభ్యాసము లేక దూషించెదరు సరే. అందుకుఁ జింతలేదు. ఇతరు లెంతో జాగ్రత్తగా వ్రాసినదానిలోనుంచి తమకు దూషణయున్నది, నన్నీకయన్నాఁడనుని వ్రాయుటకు వెనుదీయురే, ఇదెక్కడిపాపము? దైవమనుచు నొకఁ డున్నాఁడని వ్రాసెడి వ్రాఁతయైనా యది? ఆత్మవ త్సర్వభూతాని. అందుకుఁ జేసిన ప్రయత్న మింకను జాల నున్నది. ఆభాగమంతయు నుదాహరించినఁ జాల వ్రాయవలె. దీనివల్ల నాత్మకు యశస్సు రాఁగలదని దూషకుల యాశయమని వేఱే వ్రాయవలసియుండదు. కాని యది వట్టి భ్రాంతి కాదనుకొనెడి పద్ధతిని మనకంటెను బాగుగాఁ దిట్టఁగలవా రుండెదరు, వారలఁ గట్టిగ మెచ్చి తిట్టుఁడనఁగాఁదగదో, తమకేటి కీర్తిమల్, అని నాసలహా. ఈలాటివే యశస్సునిచ్చెడియెడల నిష్కళంక యశోమూర్తులు లోకములో నరుదుగా నుండవలసిరాదు. ఎక్కడఁబట్టిన నక్కడే యుండియుందురు. దీని నొకపద్యముతో గానముచేసెదను.

మ. యశమార్జించుటకోసమే సకల మీ యత్నంబు. నిక్కంబు. తా
దృశు లీలాటిప్రయత్నముల్ సలిపిన ట్లిందేని యున్ విందుమే?
పశువాక్కో యశమన్న? కత్తిగొని పప్పుప్పప్పు చోచోప్పెయనన్
వశమై యుండదు గేయునే? భయమె యవ్యామాత్రికిం దిట్లనన్?

7

## —♦ వివాహము ♦—

(శ్రీ॥ శే॥ కస్తూరి శివశంకరకవిగారు)

సృష్టిలోని జంతుజాలములో మానవులకు వివేచనజ్ఞానమున్నది. కనుక వారు సర్వదా ధర్మబద్ధులు కాఁదగియున్నారు. మానవధర్మములలో ముఖ్యమయినది వివాహము. ఈధర్మమే మానవులను పశుపక్షిమృగాదులతో వేఱుచేయుచున్నది ... అవి నియమములేక తమజాతిలో నెప్పటి కేది తటస్థించిన నద్దానితో సంగమించి వెంటనే విడిపోవుచుండును మానవులు నట్లే సంగతులయ్యెదరేని వారికిని వీరికిని భేద మేమున్నది? కావున మానవుల స్త్రీపుంసాంగత్యమునకు స్థిరనియమ మవసరమయినది. విశేషేణ వహానం వివాహః. స్థిరవహానమనుట. అట్లు స్థిరనియమమే లేకున్న మానవజీవితము సుఖపర్యవసితము గాక ... అయిమూడగును. మానవజీవితము సర్వదా మమత్వముమీఁద నాధారపడియున్నది. ఆమమకారసూత్రబంధము సృష్టిచమత్కారమే ... మానవులు ... ధర్మబద్ధులై ... నచో భార్య భర్త బిడ్డ వస్తువు వాహనము ... సర్వము మమత్వముగలిగి ... సుస్పష్టమయి నిబద్ధమై యుండును. ... నియమమే లేకున్న నేవస్తు వెవ్వరిదో... సంఘము పశుతుల్యమగును. కావున ... వివాహము ... తోఁచినట్లు లెల్లఁ జేయఁదగినది గాక మిక్కిలి విచారణీయ...ము... చిరకాలానుగతమయి జనుల మనస్సులలో లగ్నమయి వేళ్ళుపాఱియున్న యాచారములను మార్చి క్రొత్తత్రోవను నడిపింపఁబూనుట యెంతకష్టమో యందఱు నెఱిఁగినవిషయమే. అట్టి కష్టనిష్ఠురతలకైన నోర్చి సర్వమును దలక్రిందుచేసి పూర్వాచారమును మార్చి నూతనాచారమును నెలకొల్పునపు డాపూర్వాచారమునం దేయేబాధలు కలవని చెప్పఁబడుచున్నవో యవి నశించి యీనూతనమార్గమునందుఁ దగినంత లాభము కనఁబడవలెను. అట్లు లాభములేనపుడు కాని విశేషించి నష్టము కూడఁ గనఁబడనపుడుకాని దానిని మార్చి దీనిని బెట్టుటకన్న నవివేకముండదు. కావున మనలో నిదివఱకు జరుగుచున్న వివాహపద్ధతులయందుఁగల నష్టలెవ్వియో వానిని మార్చి యిప్పుడు చేయవలసిన నూతనపద్ధతులును వానియందుఁగల లాభములును నెవ్వియో తెలిసికోవలసియున్నది.

... బ్రాహ్మణవైశ్యాదులలో నిదివఱకుఁ గన్య రజస్వలకాకపూర్వము తలిదండ్రులు నన్ను మున్నగు పెద్దవారి యిష్టమునను సరించి పెండ్లి చేయఁబడుచున్నది. అట్లు చేయుట యనర్థకరమనియు రజస్వలయైన తరువాత నామెయిష్టము ననుసరించి స్వయంవరపద్ధతిని వివాహము జరిగించవలెననియు నిప్పటిసంస్కారవాదుల వాదము. పూర్వపద్ధతివలనఁగలుగు నష్టము లీక్రిందిరీతి నెంచఁబడుచున్నవి.

(1) విద్యాకృషికి భంగముకలుగుచున్నది.

(2) వధూవరుల కన్యోన్యమును ప్రేమలుకలుగని యజ్ఞానదశలోఁ దదితరులచే వివాహము జరిగించఁబడుచుండుటవలన జ్ఞానమువచ్చిన తరువాత వారికి మనసులు కలియక యామరణము నెడమొగము పెడమొగములతోఁ గాఁపురము చేయవలసివచ్చుచున్నది ... ఇత్యాదులు.

ర(జోదర్శనపూ)ర్వవివాహములవలన నీబాధలు కలుగుచుండుట నిక్కమే యగు నేని పరవివాహములు చేయుటచే నీలోపములు నశించునని వేఱ చెప్పనక్కఱలేదు. ఉభయపక్షములయందలి గుణదోషములు నిష్పక్షపాతదృష్టితో విమర్శింతము.

(1) విద్యాకృషికి భంగముకలుగుచున్నది యనుటను గూర్చి

వివాహము ర(జోదర్శనమునకు) పూర్వమందు జరిగినను దంపతులు పరమందే కలియుచున్నారుకనుక నట్లు వారు కలిసి కాఁపురము చేయు ... వఱకును ... విద్యాకృషికిఁగాదుకదా; మఱియొందుకును నష్టిలేదు. రజస్వలయగులోపలఁ జదువఁగలిగినంత విద్య స్త్రీలకు ... చాలును. ఎంతవఱకును గృహభారవాహినులే కాని తదితరభారము వారికి లేదు. కావున నట్టి గృహకార్యనిర్వాహమునకు 10, 11 సంll లలోపునఁ జదువు కొన్న ప్రియమరీవిద్య చాలును. అంతకన్న నదనమైన విద్య వారికిఁ జెప్పించుటవలన నెట్టిదియుపయోగమును లేదు సరేకదా, విశేషించి ... గృహకార్యములయం దుదాసీనత యుఁ బైవిషయములయం దాసక్తియుఁ గలిగి...పురుషులతోపాటు బహుముఖగామినులయి యింటిపనులనుండుటయం దిచ్ఛయింపరు. పైవ్యాపారము లొకరును నింటివ్యాపారము లొకరును నిర్వహించుకొనుట దంపతీధర్మమైయున్నది. అట్టియెడల నింటికట్టున నొక్కరును నుండకపోవుట తటస్థించి యందుచే సంసారసుఖము లేకపోవుట కలుగును ...కావున స్త్రీలకు విద్యయే మితవాంఛనీయమయి...(రజోదర్శన)పూర్వవివాహమువలన నెంతమాత్రము నష్టిగలుగదు.

పశ్న. ఇందువలనఁ బురుషులకయినను విద్యాభంగ మగుచున్నదా లేదా ?

ఉ. పురుషులవిషయ మిపుడు ప్రస్తావనీయము కాదు. స్త్రీలనుగూర్చియే వివాహము ర(జోదర్శన)పూర్వమందు యుక్తమా పరమందు యుక్తమా యను చర్చ సర్వత్ర వినఁబడుచున్నదికాని పురుషులనుగూర్చి లేదు. వారి కట్టిహద్దును లేదు. వారు విద్యాకృషి పూర్తియైనతరువాతనే పెండ్లిచేసికొనవచ్చును.

ప్రశ్న. ర(జోదర్శనా)నంతరవివాహము లంగీకరింపఁబడనియెడలఁ బైనఁ జెప్పిన యంశము సరిపడదు...అధమపక్షము 25సంllములకుఁ గాని పురుషులకు విద్యాకృషి పూర్తికాదు. అప్పు డాతఁడు వివాహముచేసికొనుటకు రజస్వలలైన కన్య లుండనప్పుడు వయసుకలియని 10సంllములలోపు కన్యనుమాత్రమే పెండ్లిచేసికొనవలసివచ్చును. ఇప్పటి దంపతుల కింత వయోభేదము యుక్తముగానుండుటలేదు...10ఏండ్లపిల్లలకే వివాహము చేయవలసినయెడల విద్యపూర్తియయిన 25ఏండ్లవరున కిచ్చుట యననుకూలముగానుండును గనుక నధమపక్షము 16ఏండ్లవరునకైన నీయవలసియుండును. ఇంకను జుట్టుఁబట్టుఁ గొలిచి 10ఏండ్లపిల్లను 12ఏండ్లవరునకే యీయవలెననుచున్నారు. అంతట రెండుసంllలకే వధు పీడేటి కాఁపురమునకై సిద్ధమగును. అందుచే విద్యాకృషికి భంగమగుచుండలేదా?

ఉ. పురుషుఁడు 25సంllల వయసువచ్చిన విద్యాకృషి పూర్తిచేసికొన్నతరువాతఁ జిన్నపిల్లను బెండ్లిచేసికొన్నచో నాపిల్ల త్వరగాఁ గాఁపురమునకు రాదని తోఁచినయెడల

నప్పటికిఁ గాఁపురమునకు రాఁదగిన పిల్ల నంతకులోపలనే పెండ్లిచేసికోవలెను. తన యిరువదవయేట 10, 11 ఏండ్లపిల్లను బెండ్లిచేసికొనునేని యీలోపములుండవు. అంతకన్నఁ దక్కువవయోభేదము మిక్కిలి యననుకూలము... జుట్టుజుట్టుఁ గొలిచి చిలుకగోరంకులకువలెఁ బెండ్లిచేయుచున్నారే కాని యందువలనఁగలుగుచున్న మహానర్థముల నెవరును గమనించుటలేదు. 16 ఏండ్లయినను నిండకముందే భార్య కాఁపురమునకు వచ్చుటయుం భర్త యప్పటి కింకను బాల్యవిచేష్టితములయందే యాసక్తుఁడై యుండి భార్యయందుండవలసిన ప్రేమమోహాదులు లేకపోవుటయే కాక యింకను విశేషించి తన యాటపిల్లలయందువలె నాపిల్లయందు మాటిమాటికిఁ గలహభావమే యుదయింప "అమ్మా యీలంజముండ నన్నేలాగు గిల్లుచున్నదో చూడవే" అని తల్లితో ఫిర్యాదుచేయునంతటి ముగ్ధస్థితిలో నుండును లోకములో నత్తయామబిడ్డలకుఁ గోడలన్నచో శత్రుభావము తప్పనిసరియగుటచే వారీపిల్లను నోరెఱుఁగని యజ్ఞానదశలో నానాహింసలను బెట్టుచుండఁగా దాని యోగక్షేమములను బాలించఁదగిన భర్తకూడ నజ్ఞానియై వారితోడనే కూడి తనకు మానప్రాణములర్పించి తన ప్రాణమునకుఁ బ్రాణమై వచ్చిన భార్యను గర్భశత్రువురాలినిగా భావించి లంజముండ నింకను గొట్టుఁడని వారికి మఱింత ప్రోత్సాహముకలిగించునప్పుడాపిల్ల యవస్థ యెట్లుండునో యూహించుటకు బుద్ధిమంతులకే విడిచిపెట్టుచున్నాఁడను. ఈబాలదంపతుల పడకింట్లో... క్రిందవేసి యీడ్చుబరబరధ్వనుల నెడు ఢేకారవములతోడను బుంఖానుపుంఖములుగ వీఁపుపై దబదబ వేయు చఱపులనెడు తాటిపండ్ల చప్పుళ్ళతోడను నతిరోషమున జ్యోతులఁ దెలుగు నేత్రముల ఝుగ్గుఝుగ్గులనెడు మెఱుపులతోడను... రోదనధ్వనులను నుఱుములతోడను గన్నీటిధారలనెడు వర్షములతోడను ..వర్షాకాలదుర్దినమువలె బీభత్సమై యమసదనసదృశమై యుండును. కావున భార్య కాఁపురమునకు వెళ్లునప్పటికి భర్తకుఁ గొంతయయినను లోకానుభవముగలిగి 25 సం|లవయస్సయినను గలిగి యుండవలెను. అధమపక్షము 20 సం||లయినను నుండకున్న నాపిల్ల కంతకన్న నరకలోకము మఱియెచ్చటను నుండదు. కావున 10, 11 సం||ల కన్యను రమారమి 20 ఏండ్లకన్నఁ దక్కువవయసుగల వరునకిచ్చుట క్షేమముగాదు. అట్లు 20 ఏండ్లవరున కిచ్చినచో మఱి రెండుమూఁడేండ్లనాటికిఁ బిల్ల కాఁపురమునకువచ్చునప్పటికిఁ బిల్లవాఁడు విద్యాకృషి ముగింపుచేయుసమయ మాసన్నమయియుండును. 25 ఏండ్లు దాఁటకుండనే యుద్యోగముఁ బ్రవేశించవలసిన విధియున్నదికనుక నాలోపుగానే విద్య ముగించవలసియుండును గనుక నట్లు ముగించి యుద్యోగములోఁ బ్రవేశించుసమయమునకే భార్యయు నక్కఱకు వచ్చి యుక్తముగానుండును. ఇఁక విద్యకు భంగ మెట్లుకలుగును? అదికాక యనుభవమునుబట్టి చూచినచో నిప్పుడీ బియేబియల్ పరీక్షలు ప్యాసగుచున్న వా రందఱును వివాహములుకానివారేనా? వారి కేలవిద్యాభంగము కలుగలేదు? మఱియు, భార్యలు కాఁపురమునకువచ్చిన తరువాతఁగూడ గొప్పగొప్పపరీక్షలు ప్యాసయినవా రనేకులు కలరు. కావున ర(జోదర్శనపూ)ర్వవివాహములవలన స్త్రీలకుఁగాని వారిమూలమునఁ బురుషులకుఁగాని విద్యాకృషికి భంగముకలుగుననుట చెల్లదు.

(2) వధూవరు లన్యోన్యము వరించుకొనఁజాలని యజ్ఞానదశలో నితరులచే వివాహము చేయఁబడుచుండుటచే దరువాత మనసులు కలియక యామరణము నెడమొగము పెడమొగములతోఁ గాఁపురము చేయవలసివచ్చుచున్నది. రజోదర్శనానంతరము స్వయంవరపద్ధతి నైనచో నెప్పుడు నెట్టి పొరపొచ్చెములు నుండక క్షీరనీరన్యాయమునఁ గాఁపురము చేయుదురనుటనుగూర్చి

ఈప్రశ్న మిగుల నవాలోచితమయినది. సహజమయిన విమర్శనశక్తిలేని గతానుగతికు లిట్టిసంగతులు చెప్పుచుందురు. ఇప్పటి నికృష్టకాలములో స్వయంవరమన నేమి? వధూవరు లన్యోన్యమును బెండ్లిగాఁడు వరించుకొన్నారనునంతమాత్రమున వారిమనసుల కెపుడును వికారములు కలుగవా? అప్పటివేషభాషలను జూచుకొని యొకరినొకరు వలచినారే యనుఁడు. అది యెల్లకాలమును నిలుచునా? దంపతు లెల్లకాలమును ననురాగబద్ధులయి యుండుటకు వారి యోగ్యతయు వారు కాఁపురము చేయుదినములలో దైవానుగ్రహముచేఁ గలిగిన వారి యైకమత్యమును గారణములుగాని రెండవది యెద్దియు వారి యనురాగగ్రంథిని నిలుపఁజాలదు. వలపు చంచలమయినది. అది రూపమునుబట్టియే కలుగుట బహుళముగ సహజముగనుక రూపవిశేషము కనఁబడినపుడు దానికిఁ జాంచల్యము కలుగుట విధాయకము. కన్యా వరయతే రూపం ...

ఈస్వయంవరవివాహములవలన జీవితకాల మంతయుఁ బ్రేమలుకలిగియుండుట సర్వాబద్ధమనుటకు మనవారెవ్వరియాచారము నాదర్శముగాఁగొని యిట్లు చేయవలెనను చున్నారో యాపాశ్చాత్యవివాహములే దృష్టాంతము. వారిలో వధూవరు లన్యోన్యమును వరించుకొనుటయే యాచారము. తాత్కాలికవరణమే కాక కొంతకాల ముభయులును యథేచ్ఛముగాఁ గలసి విహరించి సర్వవిధముల ... చూచుకొని మఱియుఁ బెండ్లాడుదురు. అట్టి వారిలోఁగూడ ననేకులు కొలఁదికాలములోనే ... వివాహవిమోచనములు చేసికొనుచుందురు. దినదినము నచ్చటి కోర్టులలో వివాహవిమోచనపు టర్జీలు వందలకొలఁది దాఖలగుచుండునట. ఒకప్పు డొక దొరసాని తనమగఁడు తన యంగీకారము పుచ్చుకొనకుండ ముద్దుఁబెట్టుకొన్నాఁడని వివాహము రద్దుచేసికొన్నదట. ఆస్వయంవరణబల మచ్చట నేమయినది? ... వరించిన పురుషునికన్న మఱి యెట్టియింద్రునిగాని చంద్రునిగాని తృణప్రాయునిగాఁజూచునట్టి జితేంద్రియత్వమును ... తన్ను నిలువునఁ జీఱుచున్నను నోర్చుకొని యాతనియం దెట్టిక్రోధమును బూననట్టి ధర్మబద్ధతయు నిత్యాది గుణములున్నప్పుడుకదా స్వయంవరణమందలి యుపయోగము! ఆధర్మము లేపురాణముల యందో విని సంతసించవలసినవే కాని యిప్పు డెచ్చటనైనఁ గలవా? లేనపుఁ డీక నా పద్ధతివలన ఫలమేమి? ఓరపాఁగఁ జుట్టుకొన్నవానిఁ జూచి యిప్పుడు వరించిన మిటారి యింకొకప్పుడు కోఅమీసపు శృంగారశేఖరునిఁ జూచి యేల యాటలాడకుండును? కావున రూపలోలుపమైన వలపు రూపవిశేషదర్శనమందుఁ జలింపకమానదనుట నిర్వివాదము.

ప్రేమబద్ధమైయుండుటకు వరణమే ప్రధానముకాదు. యోగ్యత ... అట్లుకలియదేని యేసందర్భమున నేమాత్రపు టభిప్రాయభేదమువచ్చినను ... క్షణములో విడియాకు లందుకొందురు. ఎక్కడిస్వయంవరములు? ఎక్కడివలపులు? ... స్వయంవర

మనఁగా నొకరేర్పఱచినట్లు కాక స్వయముగా వరించుటయని యర్థమగును గాని యొన్నిడును నాతనితో ద్వేషించఁగూడదనికాని రెండవవాని నపేక్షించఁగూడదనికాని యందెచ్చటను నర్థములేదు. కావున నుత్తరోత్తరాభిలాషచే నెంతమందిని వరించుచున్నను నది యెల్ల స్వయంవరణమే యగుచుండును. తప్పేమి? కావున వివాహమునకుఁబూర్వమందలి వలపువలనఁ దరువాతఁగలుగవలసిన యైకమత్యమున కించుకంతయు లాభము లేదు. ఆ వలపు తాత్కాలికవేషభాషలపై నాధారపడియుండునుగాని ... తక్కినగుణవిశేషములను బరీక్షించుకొనుట కవకాశ మీయదు. గుణగణములనుబట్టికాని యచంచలదృఢానురాగము కుదురదు. ...

ప్రశ్న॥ పూర్వము స్వయంవరవివాహములు జరుగలేదా? ఆదాంపత్యములు దృఢానురాగబద్ధములయి శాశ్వతకీర్తులను సంపాదించలేదా?

ఉ. పూర్వవృత్తాంతములఁ బోల్చుకొనుటకన్న నవివేకము వేఱొకటిలేదు. అది ధర్మకాలము. ఇది యధర్మకాలము. అప్పుడయినను స్వయంవరవివాహములు జనసామాన్యమున బాహాటముగాలేవు. క్షత్రియులలో మాత్రము సకృత్తుగా జరిగినట్లు కనఁబడుచున్నది. ఆవధూవరులు వారివారి గుణములు లోకములో బహుముఖములఁ బ్రకాశింపఁగా విని యనన్యచింతనులయి వరించుకొనెడివారు. ధర్మబద్ధులయిన మహాగుణవంతులు కావున నెట్టియనిష్టములయందైనను నొకరినొకరువిడువక యేకప్రాణముగా మెలఁగెడువారు. దమయంతి నలుని గుణములను విని యాతని వరించినతరువాతఁ ద్రిలోకాధిపతియైన దేవేంద్రునిగూడఁ దృణమువలెఁ బరిత్యజించినది. ఇప్పటి తోఁటకూరమొక్క లట్లు చేయుదురా? గిరబాల గీర్వాణరావుగారి నిపుడు వరించిన కూడకట్టుల సుందరదన క్రొపింగుల కామేశ్వరరావుగారిని జూచి యింతలోనే ముచ్చటపడును. సత్యవంతుని సావిత్రి మనసా వరించిన తరువాత నతఁ డాయుర్విహీనుఁడని తెలిసినను దనపట్టు విడిచినదికాదు. ఇప్పటి గ్రుడ్డిగచ్చకాయ లటు చేయఁగలరా? తాను వరించినతరువాతఁ బెండ్లికొడుకున కెప్పుడైనను గొంచెము దగ్గుఁ వచ్చుచుండుట తెలియఁగానే హత్తేరీ వీఁడు నాకు వలదింకొకని జూడుఁడని యప్పుడే త్రోసివేయును.

కావునఁ బర్యవసాన మేమన నయోగ్యులగువారు స్వయముగా వరించుకొన్నను నేసందర్భముననో యొకరిమాట యొకరికి నచ్చక నీవుశుంఠవనిన నీవుశుంఠవని మూడునాళ్లకట్టపగటిలోఁ గోతివలెఁ గాట్లాడుకొనక మానరు. ఇందుకుఁ బాశ్చాత్యస్వయంవరదాంపత్యములే దృష్టాంతము గాక మనలోఁగూడ నిప్పుడిప్పుడీస్వయంవరపద్ధతిని వివాహమాడి కొలఁదికాలములోనే రసాభాసమయినవి...

---

## —♦ సమావేశనప్రశంస ♦—

శేషగ్ం సమావేశనే జపతి యని యాపస్తంబసూత్రము. పాణిగ్రహణముఁ జేసికొనిన వధూవరులు వివాహదినప్రభృతి నాలుగుదినములు వివాహదీక్షాధర్మముల ననుష్ఠించి తం చతుర్థ్యా మపరరాత్ర్యా మను సూత్రప్రకారము నాలవదినమునయొక్క యపరరాత్రియందు శేషహోమము సమాప్తిపఱచి యాపిమ్మట నారోహోరుమనెడి యనువాకము

జపించుట సమావేశనము. ఇటుల లోకములో శిష్టాచారము. ఇటు లుండఁగా శేషహోమానంతరము ఋతుసమావేశనే యని చెప్పియుండుటవల్ల వధూవరు లారోహోరు మను ననువాకము నప్పుడు పఠించి సహశయనముఁజేసి మైథునక్రియ జరపవలయునని కొందఱు చెప్పుచున్నారు. వివాహమధ్యకాలమందుఁగాని యంతమందుఁగాని యా స్త్రీ ఋతుమతియైనపక్షమందుఁ బ్రథమార్తవదినప్రభృతి నాలవదినమందు గర్భాధానసంస్కారముఁ జేయుపక్షమం దప్పు డారోహోరుమనెడి యనువాకము పఠించి పిమ్మట విష్ణుర్యోనిమనెడి మంత్రముచే నభిమంత్రించి మైథునక్రియ జరపవలయునని మఱికొందఱు చెప్పుచున్నారు. శేషహోమాంతమందు సమావేశనము సహశయనము మైథునక్రియ జరపవలయునని సూత్రమందుఁ జెప్పలేదు. శేషహోమాంతమందు మైథునక్రియ జరపవలయునని చెప్పినపక్షమందు వివాహ స్త్వష్టవర్షాయా యని యష్టమసంవత్సరమందు వివాహము విధించియుండఁగా నవృతుమతీసంభోగము సంప్రాప్తమగును. అనృతుమతీసంభోగము పాతిత్యమునకు హేతుభూతమని శాస్త్రము నిందించియున్నది.

శ్లో. ప్రాగ్రజోదర్శనా త్పత్నీం నేయా, ద్గత్వా పత త్యధః,
వ్యర్థకారేణ శుక్లస్య భ్రూణహత్యా మవాప్నుయాత్.
(ఆశ్వలాయనః)

అప్రౌఢాం కన్యకాం విప్రో యభే త్కామాతురో రహః
తస్యైవ నరకే వాసః, కానీనస్యా త్తదుద్భవః, (హేమాద్రిః)
అసంస్కృతాం పుష్పహీనాం కన్యకాం యో ద్విజాధమః
రంతుమిచ్ఛతి పాపాత్మా నరకం యాతి దారుణం(మార్కండేయః)

ఇత్యాదివచనము లనృతుమతిస్త్రీతోనువివాహితకన్యకతోను సంభోగము చేయుంట రౌరవాదినరకకారణమని విధించుచున్నవి.

శ్లో. ఋతుకాలాభిగామీ స్యా, త్స్వదారనిరత స్సదా,
పర్వసు ప్రవ్రజే న్నైనాం త ద్వ్రతో రతికామ్యయా (మనుః)

కావున వివాహానంతరము ప్రథమార్తవము సంభవించిన పిదప యథోక్తముగా నగ్నిస్థాపనాదులు నవగ్రహమఖాదులు జరిపి యారాత్రి సులగ్నము నిర్ణయించి బ్రాహ్మణాశీర్వచనములు పొంది విష్ణుర్యోనిమంత్రమును బఠించి యూపైన స్వభార్యయైన స్త్రీతో సంభోగించుట గర్భాధానమని మొదటిసంస్కారముగా విధింపఁబడియున్నది. ఇటులజరిపిన సుపుత్రుఁడు జనించునని శాస్త్రము.

శ్లో. విష్ణుర్యోనిం జపే త్సూక్తం యోనిం స్పృష్ట్వా త్రిభి ర్వ్రతీ,
గర్భాధానం తతః కుర్యా, త్సుపుత్రో జాయతే ధ్రువం,

ఇటుల షోడశసంస్కారములలోఁ బ్రథమముగా విధించియున్న గర్భాధాన మమంత్రవత్తుగా జరిపినపక్షమందుఁ బ్రాయశ్చిత్తము విధించియున్నది. అలగ్నబలముచే గర్భోత్పత్తియయినపక్షమందుఁ బుంసవనము చేసికొనవలెను. సంస్కారము లేకుండనే గర్భా

ధాన మైయున్నచోఁ ద దకరణప్రాయశ్చిత్తము చేసికొని పిమ్మటఁ బుంసవనము జరిపించ వలయునని శాస్త్రనిర్ణయము. ఇటుల గర్భాధానసంస్కారము పృథక్కుగావిధించియుండు నపు డనృతుమతీసంభోగము వివాహాంకమందు జరిపించవలయుననుట యెంతటిసాహసకృత్యము? ఎంతటిపాతకము? శ్రుతిస్మృతిశిష్టాచార మిహపరములకు రెంటికి నవిరుద్ధమైన విషయము కలిలో నింకను గర్భులయందు శ్రద్ధ దేవబ్రాహ్మణులయందు భక్తి కనఁబడుచున్నది. మన పూర్వులు ఋతుమతీవివాహానృతుమతీసంభోగాదు లాచరింపలేదు. పరులకు బోధింపలేదు. వా రంతటి సమర్థులుకారా? పరలోకభీతి కలవారు. ఇవి సదాచారముగానుండుపక్షమందు వారెందు కనుష్ఠించియుండరు? కావున ననాచారమని మానినారు. నిబంధనకారులు కృతత్రేతాద్వాపరయుగములందువలె లోకులు ధర్మాననుష్ఠింపఁజాలరని కనిపెట్టియే కలియుగమం దనేకధర్మములు నిషేధించిరి. నిషేధించినవి పోను లోకులను దరింపఁజేయుటకుఁ జంద్రికామాధవీయాది నిబంధనకారులు బహుసూక్ష్మముగా ధర్మమార్గముఁ జూపియున్నారు. అట్టిధర్మములను బండితోత్తములు కనిపెట్టి చెప్పుచున్నారు. కొందఱు శాస్త్రాభిప్రాయ మొకత్రోవనుండ మఱియొకత్రోవగాఁ జెప్పుచున్నారు. కొందఱు శాస్త్రాభిప్రాయము గ్రహించియుఁ బొట్టనిమిత్తమై మఱియొకవిధముగా బయలుపఱచెదరు. ఒకవేళ సరిగాఁ జెప్పినను లోకులనుష్ఠించుటదుస్తరము. మంచితెలివితోఁగూడినజన్మములభించియుండియుసంసారదుఃఖసాగరమందు మగ్నులై వృథాకాలయాపనముఁ జేయుచున్నారు.

శ్లో. ప్రాతర్ద్యూతప్రసంగేన మధ్యాహ్నే స్త్రీప్రసంగః
రాత్రౌ చోరప్రసంగేన కాలో యాతి దినేదినే.

కాలత్రయమందుఁగాని యొకకాలమందుఁగాని పరమునకు సాధనమైన మంచికాలక్షేపము జరుపుట జ్ఞానముతోఁగూడిన జన్మము మనకు లభించినదానికి సార్థకము.

శ్లో. భూతానాం ప్రాణిన శ్శ్రేష్ఠాః, ప్రాణినాం మతిజీవినః,
మతిమత్సు నరా శ్శ్రేష్ఠాః నరేషు బ్రాహ్మణా స్స్మృతాః,
బ్రాహ్మణేషుచ విద్వాంసః, విద్వత్సు కృతబుద్ధయః,
కృతబుద్ధిషు కర్తారః, కర్తృషు బ్రహ్మవాదినః,

ఇట్లు బ్రాహ్మణ్యము మహాప్రశస్తముగా మన్వాదులచేఁ జెప్పఁబడుచున్నది. జగత్స్థిరీకరణ ధర్మస్థిరీకరణ మంతయు బ్రాహ్మణుల ప్రభావమని స్మృతికర్తలు చెప్పుచున్నారు. కావున బ్రాహ్మణు లెన్నివిధములైన కష్టములు సంభవించినను నెన్నివిధములైన విఘ్నములు సంభవించినను ధర్మమార్గములోఁ బోవుట ధర్మానుష్ఠానము తప్పకచేయుట జన్మసాఫల్యము. వేదమునకును శాస్త్రమునకును శిష్టాచారమునకును విరోధముఁ లేకుండను నిహమం దపయశస్సు కెడము లేకుండను మంచి లోకాంతరములకుఁగాని కైవల్యపదవికిఁ గాని భంగము లేకుండను ధర్మముగా నడుచుకొనవలయును.

శ్లో. శ్రుతిం పశ్యంతి మునయః, స్మరంతిచ తథా స్మృతిం,
తస్మాత్ప్రమాణ ముభయం, ప్రమాణైః ప్రమితం భువి,

ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం ప్రథమం శ్రుతిః,
ద్వితీయం ధర్మశాస్త్రంతు, తృతీయం లోకసంగ్రహః
(ఆనుశాసనికము)

శ్రుతిస్మృతీతి విప్రాణాం చక్షుషీ ద్వే వినిర్మితే,
కాణ స్తత్రైకయా హీనః, ద్వాభ్యాం మంధః ప్రకీర్తితః,
అధీత్య చతురో వేదాన్ సషడంగపదక్రమాన్
స్మృతిహీనా నశోభంతే చంద్రహీనేవ శర్వరీ.

ధర్మానుష్ఠానతత్పరులుగానుండు మహాత్ములకు శ్రుతియు స్మృతియు రెండు నేత్రములు. ఇందులో నొకటి తెలిసియుండి యొకటి తెలియకయుండిన నొకనేత్రము లుప్తమైనవాఁడు కావున వేదము శాస్త్రము నధ్యయనముచేసిన విశేషము. అథవా శ్రుతి తెలిసినను తెలియకయుండినను స్మృతివల్ల సకలధర్మములుఁ దెలిసికొనవలయును.

శ్లో. మన్వాదయః ప్రయోక్తారో ధర్మశాస్త్రస్య కీర్తితాః,
తత్ప్రయుక్త ప్రయోక్తారో గృహ్యకారాశ్చ మంత్రితః,

వేదమందు సకలధర్మములు సూక్ష్మముగాఁ దెలియఁజేయఁబడియున్నవి. దాని తాత్పర్యమును విస్తారముగా మన్వాదులు తెలియఁజేసియున్నారు. వాని ననుసరించి యాపస్తంబాదులు ప్రయోగసౌలభ్యముకొఱకు సూత్రములు చెప్పియున్నారు. కావున శ్రుతి స్మృతి లోకాచార శిష్టాచార దేశాచార కులాచారముల కన్నిటికిని విరోధము లేకుండ ధర్మానుష్ఠాన మాచరించవలయును. దురాచార మనుష్ఠించినవారికి వ్యాధులవల్ల నుపద్రవము లెల్లప్పటికిని దుఃఖానుభవమును నల్పాయువును విధింపఁబడియున్నది.

శ్లో. యస్మిన్ దేశే య ఆచారః పారంపర్యక్రమాగతః
వర్ణానాం సాంతరాళానాం సదాచార స్స ఉచ్యతే,
అనారోగ్య మనాయుష్య మస్వర్గ్య మతిభోజనం
అపుణ్యం లోకవిద్విష్టం తస్మాత్తత్పరివర్జయేత్ (మనుః)
అస్వర్గ్యం లోకవిద్విష్టం ధర్మమ ప్యాచరే న్నతు(యాజ్ఞవల్క్యః)

ఏయేదేశములం దేయేవర్ణములకును నేయే యాశ్రమములకును మన్వాదులచే విధింపఁబడియున్నది యాయాదేశములకు సదాచారము. అట్టియాచారమునకు విరోధముగా నడుచుకొనఁగూడదు. కులక్రమాగతముగా వచ్చుచుండునదికూడ ధర్మమని చెప్పఁబడియున్నది.

శ్లో. యేనాస్య పితరో యాతా యేన యాతాః పితామహాః
తేన యాయా, త్సతాంమార్గః, తేన గచ్ఛ న్నదుష్యతి (మనుః)

అధర్మమార్గముగా మనమునడుచుచుఁ గష్టమనుభవించునపు డీశ్వరుని నిందించిన ఫలమేమి? శ్లో. అవశ్య మనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభమని శాస్త్రమందు నిర్ణయించి యీశ్వరుఁడు తాను దప్పించుకొన్నాఁడు. శ్లో. హానద్భిః క్రియతే కర్మ రుదద్భిరనుభూయతే యను శాస్త్ర ప్రకారము మన మధర్మపరాయణులముగా నుండుటవల్ల నల్పాయుష్కుకు నయశస్సుకు స్థానభూతుల మగుచున్నారము.

శ్లో. అధర్మకృత్యా లోకానా మల్పమాయు ర్భవిష్యతి,
పరమాయు శ్శతం త్వేకం మనుష్యాణాం కలౌ స్మృతం,
అశీతికాశ్చ విద్యంతే, కేచి త్స ప్తతికా నరాః.
నాపి జీవంతివై కేచి త్తథా వర్షాణి వింశతిః,
గర్భస్థాశ్చ మ్రియంత్యేతే, తథా జాతా మ్రియంతిచ,
(పురాణసారః)

హేజనాః! కిం నపశ్యధ్వ మాయుషోర్ధంతు నిద్రయా
హృతంచ, భోజనాద్యైశ్చ కియదాయు స్సమాహృతం,
కియదాయు ర్బాల్యభావాత్, వృద్ధత్వాచ్చ కియద్ధృతం,
కియ ద్విషయభోగైశ్చ, కదా ధర్మాన్ కరిష్యథ?
బాలభావేన బాధ్యంతే, నఘటే తాచ్యుతార్చనం,
వయస్యేవచ ధర్మాన్వై కురుధ్వ మనహంకృతాః,
మా వినశ్యథ సంసారగర్తమగ్నా వృథా జనాః!
వపు రిన్ద్రియనిలయ, మాపదాం పరమం పదం,
శరీరం రోగనిలయం, మల్లాద్యైః పరిదూషితం,
కిమర్థం శాశ్వతధియా పాపం కుర్వంతి సర్వదా?
అసారభూతే సంసారే నానాదుఃఖసమన్వితే
విశ్వాసో మాత్ర కర్తవ్యో, నిశ్చితం నాశ మేష్యథ,
మాతుర్గర్భా ద్వని ష్క్రాంతో యథా జంతు స్తథైవహి
మృత్యువక్త్రగతో బాఢం, తస్మా ద్ధర్మపరోభవ,
(బృహన్నారదీయః)

ఇత్యాది పురాణములయం దిట్టి మహాకలిలోఁ గూడఁ దరించుట కుపాయము చూపియున్నారు కావున సద్ధర్మానుష్ఠానము చేయుచుఁ గృతార్థులు కావలయును.

శ్లో. వేదోదితం స్వకం కర్మ నిత్యం కుర్యా దతంద్రితః,
తద్ధికుర్వన్ యథాశక్తి ప్రాప్నోతి పరమాంగతిం (మనుః)

ఏ. పి. యల్.

---

## —♦ ఆంక్షపత్రికలవిషయమైన లాపాయింటు ♦—

[టం. నాయనశాస్త్రిగారు, జిల్లాకోర్టుప్లీడరు, గుంటూరు, 29-6-1927 ఆం. వా. ప.]

బ్రాహ్మణులలో ... స్త్రీగాని పురుషుఁడుగాని యగమ్యాగమనముచేసినను వ్యభిచరించినను...తినఁగూడని పదార్థములను భక్షించినను...బ్రాహ్మణుల సదాచారము మానివేసి దురాచారుఁడైనను శ్రాద్ధములు మానినను నమావాస్యతర్పణములు మానినను సంధ్యావందన బ్రహ్మయజ్ఞములు మానినను గోర్టులోఁ దప్పుసాక్ష్యము పలికినను ఖూనీనేరములు చేసి మరణదండన తప్పించుకొని కొద్దికాలము శిక్ష యనుభవించినను మఱి యేనేరమున కయిన శిక్షయనుభవించి యిల్లుచేరినను ... సభవారు బహిష్కరింపవచ్చును...కోర్టులో శిక్ష విధించియుండిన సాజడ్జిమెంటు సాధారపఱచుకొని వేఱుగా విచారణచేయ నవసరములేకుండ...తీర్మానించి మఠాధిపతులకు రిపోర్టుచేసి యాంక్షపత్రిక తెప్పించవచ్చును. ఇందులో డెఫమేశన నేమియు లేదు...దావాచెల్లదు. దావారాకుండ...నిందితుఁ డీతప్పు చేసినాఁడని బ్రాహ్మణుఁ డెవరైనను సరియే, ఫిర్యాదుచేయవలెను. ఆఫిర్యాదును...సభాపతి బ్రాహ్మణసమావేశము చేసి విచారణకు వాయిదా నిర్ణయించి యావాయిదా కానిందితుని హాజరుకావలసినదిగా రిజష్టరు ఉత్తరము పంపవలసినది. ఆవిచారణసభకు... బ్రాహ్మణులుఁ దప్ప నితరకులస్థుల రానీయఁగూడదు...రానిచ్చినయెడల డెఫమేశన్ సంభవించును ...నిందితుఁడు హాజరైనచో నేరముసంగతి .. చెప్పి... చెప్పెడిసమాధానమును వ్రాసికొని యందులో నాయనను దస్కతుచేయుమన వలెను...సభకు వచ్చినను సరియే, నోటీసు దాచుకొని రాకపోయినను సరియే. అతఁడు చేసిన తప్పునుగుఱించి సాక్ష్యము విచారించి కైఫీయతులను సభాపతి వ్రాయవలెను. ఆసాక్షుల నానిందితుఁడు క్రాసు వేయుటకవకాశ మీయవలెను ... ఉత్తరసాక్ష్యము కూడ నతఁడు కోరుకొనిన ... విచారించవలెను ... తర్వాత...సభలోనుండు బ్రాహ్మణుల ... అధికసంఖ్యాకుల యభిప్రాయప్రకారము ... తీర్మానము చేయవలెను. ఆతీర్మానములో నాసభయందుండువారందఱును దస్కతు చేయవలెను. చేయనివారిఁ జేయుటలేదన్నారనికూడ వ్రాయవలెను. ఆ...తీర్మానము.. నిందితుని కప్పుడే.. సభాపతి చెప్పవలెను... మఠాధిపతికాంక్షపత్రికనిమిత్తము .. రిపోర్టుచేయవలెను...వచ్చిన నాయాంక్షపత్రికను నిందితునికి రిజష్టరుపోష్టుకవరు ద్వారమున...పంపవలెను.... కార్డు ద్వారమునఁ బంపఁగూడదు ...ఈప్రకారము జరుపుచో నాంక్షనుగుఱించి సివిల్ ...క్రిమినల్ చెల్లదు. రాజమండ్రిలో . స్వాములవా రాంక్షపత్రికను పోష్టుకార్డుద్వారమునఁ బంపినందుకు ... మదరాసు హైకోర్టువారు జరిమానా వేసినారు. కవరులోఁ బంపుచో నేరముకాదనికూడఁ దీర్పు చెప్పినారు. ఆంక్ష పెట్టెడి యధికారము కులమువారికి మఠాధిపతులకు నున్నదనిగూడఁ దీర్పుచేసినారు...ఆంక్షపత్రిక నితరకులస్థుల యెదుటఁ బ్రచురపరచిన.. నేరము... ఏకులమువా రాకులస్థులను మాత్రము పిలిచి సభచేసి నిందితుఁ డాంక్ష కర్హుఁడని తీర్మానించి...న నేలాటితప్పు లేదు.. దోషికానివానిని దోషియయినట్లు సాక్ష్యమునుబట్టి... తీర్మానించినను సభవారికిమాటరాదు. ఈప్రకారము క్రమముగా విచారణచేయక...నిందితుని దోషియని యాంక్షలో నుంచుచో మాత్రము ... డెఫమేశన్ ... కావచ్చును. కనుక నేనువ్రాసిన యంశములను గమనించి...నడచుకొందురుగాక.

క. కందుకములతో నంగణమందుఁ బాలకుఁడు లీల నాడెడుగతి న
ర్కేందువులతోడ నాకసమం దీతఁడు క్రీడసల్పునట్లు వెలుంగున్.

తే. సకలజీవప్రభేదముల్ సమయఁజేయు
కాలపురుషుండు కల్పాంతకాలమందు
సర్వభూతాస్థిమాల లాచరణము స్త
కమును ధరియించి బహువిలాసములఁజూపు. 232

తే. ఈనిరంకుశచరితు నెమ్మేనినుండి
ప్రళయమందున వెలువడు వాయువులకు
జీర్ణమై రేణురూపమై స్వర్ణశిఖరి
పై కెగయు భుజపత్రింపుఁ బట్టవోలె. 333

మ. ఇతఁడే రుద్రుఁ డితండే పద్మజుఁ డితండే విష్ణుఁడున్ వాసవుం
డితఁడే పావకుఁ డీతఁడే యముఁ డితండే కోణపుం డీతఁడే
యితఁడే పాశి యితండె వాయువును విత్తేశుం డితండే శివుం
డితఁడే యై తుది సర్వశూన్యము నితండే యాను మానీశ్వరా!

కం. అంబుధి తనయంద యజ
స్రంబు తరంగముల సృష్టిసలిపి యడఁచుచం
దంబున నీతఁడు బహుస
ర్గంబులఁ గల్పించి లయముగావించు వడిన్. 335

కం. వితత మహాకల్పాఖ్య
క్షితిరుహములనుండి పూర్వగీర్వాణసుర
ప్రతతు లనుపక్వఫలముల
నితఁ డనిశము రాల్చుచుండు నిద్ధచరిత్రా! 336

ఉ. పేలవభూతజాతములపేరిటి దోమలపిండులోపలన్
జాలఁగ ఘుంఘుమధ్వనులు సల్పుచునుండఁగ శీర్ణవృంతమై
రాలెడు పద్మజాండనికరం బనుపండిన మేడిపండ్లకున్.
గాల ముదుంబరత్వమునఁ గ్రాలుచునున్నది భూసురోత్తమా!

తే. సకలజీవక్రియాప్రియాంసహితుఁ డగుచుఁ
జిత్కళాజ్యోత్స్నచే వికసించియున్న

దృశ్యసత్తాకుముద్వతి తెలివిఁగనుచుఁ
గాలపురుషుండు మోదంబుగాంచుచుండు. 338

కం. అమితోన్నత మగు నిజదే
హమున కనంతావ్యయాత్మ యనుదృఢపీఠం
బమరిచికొని యీకాలుం
డమలాశయ ! సుస్థిరత్వ మంది వెలుంగున్. 339

కం. తనగర్భంబున లీనత గనినయసంఖ్యాకజీవఘనతరసంసా
రనికాయపారభారంబున నితఁడు ప్రతిష్ఠితత్వమున విలసిల్లున్. 340

ఉ. ఒక్కెడ నల్లనై తనరుచుండును సంతతకాంతిమంతుఁడై
యొక్కెడ రాజిలున్, మఱియు నొక్కెడ రెండును లేకయుండు,నీ
ఫక్కిని చెక్కుభంగుల స్వభావము వ్యక్తముగా నొనర్చుచున్
దక్కరియైన కాలుఁడు కటా! భువనంబుల మోసగించెడిన్. 341

ఉ. ఖేదమునందఁ డెప్పుడు, సుఖింపఁ డొకప్పుడు, నెట్టివారిపై
నాదర మింత చూపఁ, డుదయాస్తమయంబు లెఱుంగఁ,డెద్ది యాఁ
గాదనఁ, డేడకేని యరుగం, డెటనుండియు రాఁ, డనాస్థతన్
బోరఁగొనున్ దనంతఁ దను, బూనఁ డహంకృతి యించుకేనియున్.

కం. మునివర ! రే లనుపంకం
బున నొప్పుచు మొగులుతేంట్లఁ బొల్పారు పగ
ళ్లను కెందొవ లనిశంబును
దన రూపనుకొలనియం దితఁడు మొలిపించున్. 343

తే. కృపణశేఖరుఁ డీతండు కృష్ణపక్ష
రజనిపేరిటి జీర్ణమూర్జని ధరించి
మేరుగిరిచుట్టు రాలు తేజోరజంబు
నూడ్చికొని ప్రోగుచేయుచునుండు నెపుడు. 344

చం. జగమను జీర్ణసద్మమున సంయమినాయక! కాలపూరుషుం
డగణితజీవకర్మనిచయాంగుళులన్ రవిపేరిదీప మి
మ్మగఁ గొని సారెసారెకును మూఁలమూలల దేవులాడు, నే
మి గలదో యేడ నంచు మిటిమీఱిన లౌభ్యమునం జరించుచున్.

ఆ. పగళు లనెడి తెప్పపాటులు గల్గిన
సూర్యలోచనమునఁ జూచి చూచి
జగదరణ్యపక్వ దిగధీశఫలముల
మించువేడ్క నారగించు నితఁడు. 346

తే. లోకమనియెడు ప్రాయింటిలోనఁ జెదరి
పడిన సజ్జనమణులను వరుస నేఱి
భయదకోటర మగుమృత్యుమ్లవదన మనెడు
బరిణెయం దుంచు నితఁ డతిభద్రముగను. 347

కం. గుణపూరితమై తనరెడు
జనమణిమాలికల నితఁడు సద్భూషలుగాఁ
దనమేనఁ దాల్చి మరలఁ
దనయంతన త్రెంపివైచుఁ దాపసముఖ్యా! 348

కం. దినహంస లనుసరింపఁగ
ఘనతారాకేసరములఁ గడునొప్పెడు రే
లనుకలువపూలదండలఁ
దన మూంజేకడియముగ నితఁడు ధరించుఁ 349

తే. జగములనియెడు మేఁకలఁ జంపునట్టి
కటికవాఁ డనఁబరగు నీకాలపురుషుఁ
డాకసంబను సూనగృహంబునందుఁ
బడినయుడురక్తకణము లెప్పుడును నాకు. 350

ఉ. యోగివరేణ్య! యౌవనపయోరుహాసోముఁడు జీవితాఖ్యపు
న్నాగమహోగ్రకేసరియు నాఁ దనరారెడు కాలనాముకుం
డా గడిదొంగ పెద్దయనకల్పమునాక సమస్తవస్తువుల్
తాఁ గనుమూసి మ్రిచ్చిలు సతంబు నిమేషమునన్ బ్రవీణతన్.

వ. ఈరీతిఁ గాలపూరుషుండు. 352

తే. అఖిలభూతౌఘముల మృత్యుముఖమునందు
లీలఁ బడవైచు సంవర్తకేళి దేలి
భావములు లేక భావావభాసక మగు
నాత్మచేతనె రమియించు నాత్మయందు. 353

తే. ప్రళయమం దిట్లు విశ్రాంతి వడసి మరల
సర్గకాలంబు చనుదెంచ సర్వమునకుఁ
గర్త భోక్తయు సంహర్త స్మర్త యనఁగ
నఖిలభావంబులును దాన యధిగమించు. 354

తే. తన రహస్య మదెట్టివేత్తలకు నెఱుఁగ
రాకయుండఁగ సుభగదుర్భగములైన
రూపములఁ బ్రకటించుచు గోపనంబు
సేయుచున్ లోకమున విలసిల్లు నితఁడు. 355

వ. దేవా! ఉద్భటవిలాసుండును నిరస్తసకలాపదుండును నచింత్యపరా
క్రముండును నగు నిక్కాలాఖ్యరాజపుత్రుండు జగదరణ్యంబున
ముగ్ధదీనంబులగు భూతమృగంబులతోడ మృగయావిహారంబు
సలుపుచుండునట్టియెడ. 356

కం. భీకరబాడబకలితం
బౌ కల్పమహాబ్ధి యీనృపాత్మజునకు సు
శ్రీకర కమలవిలసితం
బౌ కేళాకూలియగుచు నమరు నొకయెడన్. 357

తే. అమ్లకటుతిక్తరుచులచే నమరు భూత
ము లనుకమ్మనియూరుగాయలును దుగ్ధ
దధిజలధులును గల జగత్కబళములను
జలిది గుడుచు నితండు వాచంయమేంద్ర! 358

తే. చతురసంచారశాలిని సర్వమాతృ
గణసమన్విత భూతౌఘఘాతిని యగు
చండి యీతనికిన్ బ్రియసహచరియయి
తిరుగు సంసారకాననాంతరమునందు. 359

కం. రసయుతము లలితకైరవ
బిసరుహకల్హారజాలవిలసిత మత్యు
ల్లసితమునై యొసలారెడు
వసుధ యితనిచేతిపానపాత్ర మగుఁజుమీ. 360

## — స్వీయవాణీ ప్రశంస —

ఉ. ఆదియతీంద్రుకూర్మినుతి కర్ణ్యములై మధురంబులై కడుఁ
స్వాదువులై చెలంగు మృదువాక్కుసుమంబులు గల్గి ప్రౌఢమా
నాదు కవత్కవిత్వమను నాకమహీరుహరాజ మింక నా
మోదపరంపరన్ సతతముఁ సుమనస్సుల కిచ్చుఁగావుతన్. 9

సీ. ఆమోదసంయుతంబైన కస్తూరిచే
తగురీతి నెయ్యది పొగడఁబడెడు
సమ్యగామోదమౌ చందనద్రువుచేత
ఎద్ది యొంతయును శ్లాఘింపఁబడెడు
సుందరసామోద మందారములచేత
హితమైన స్మృతి నెద్ది యెన్నఁబడెడు
సామోదకాశ్మీర సముదాయములచేత
లీలమై నెద్ది లాలింపఁబడెడు
అట్టి దోషోజ్ఝితంబైన యస్మదుక్తి
కరుణమూలిన దుష్కవిగణము బలిమి
వికృతగావించు నక్కటా వితగ మ్లేచ్ఛ
గణము దోషోజ్ఝితంబైన గవినిబోలె. 10

చం. పరుల శ్రమంబు గుర్తెఱిగి వారి మృదూక్తుల ముత్తియంబుల
ట్లలుత ధరించునట్టి కరుణాళువులుం గల గుర్వి, ఏటి కీ
విరివివిచార? మట్టి రొకవేళ సులభ్యులు గాకయుండినన్
గురుఁడు దయాసముద్రుఁడు. కనుం బ్రమదంబును నాతఁడేనియున్.

సీ. శంకరగురు గుణ స్తవము మొదలుపెట్టి
పద్యార్థమున భంగపడిరి కొంద.
అర్థార్థరచననే యక్షరాల్ తోఁపక
మఱికొంతమందితా ర్వెలుగఁబడిరి
తాదృక్తుతిని సల్పఁ దలకొంటి నిపుడునే
నింతకంటెను మౌఢ్య మేమిగలదు ?
మునిమాపువేళ న వ్వీనువీధి మనుచు నా
నంవంబొసంగెడి చందమామ

నట్టి హస్తాంబుజంబునఁ బట్టఁబోవు
మేలి గుజ్జెనగూళ్లను మెసవుకొనుచు
జననిచంకను వసియించు చంటిబిడ్డ
సాహసంబున కీడు నాసాహసంబు. 12

ఉ. ఐనను మూఁగవాండ్రఁ గర మాదృతి మంచి ప్రసంగకర్తలం
గా నొనరించుచుం గలశకంధితరంగవిలాససంపదల్
పూని హరించు సద్గురుని భూరికటాక్షము లోలలాడ నా
పైని ఘటింపరాని బలువాంఛితముల్ ఘటియించు టబ్రమే ? 13

ఉ. భూరిగురుస్తవాప్తమగు పుణ్యవిశేషముచే నుదారమై
శారద నృత్యదీశ్వరుని చారుజటాకుటిఁ బాఱునట్టి భా
గీరథి నీరపూరముల గీటడఁగించెడి స్వీయవాగ్ఝరిన్
నా రసనాగ్రపీఠమున నర్మిలి వర్తిలఁజేయుఁగావుతన్. 14

ఉ. ఎక్కడ నేను ? నీచను. మఱెక్కడ శంకరసచ్చరిత్ర ! మే
నెక్కడనో గడించు యశ మేటికి మాపెద ! రబ్ధిలోన న
న్నక్కట ! ఏలముంచెదరటం చెటొ పర్విడు వాక్కుఁ బ్రాజ్ఞ లి
ట్లిక్కృతియందు దింపిరి. యతీంద్రుమహత్త్వము చిత్రమయ్యెడిన్.

సీ. ఎండలి నుడులు దూష్యైకాక్షరములు న
సారంబులు నిఘంటుశరణములును
జౌణాదికప్రత్యయము లెందుఁ బెక్కులు
క్రాలు నెద్ది యజంతకఠినమగుచు
ఎద్దాని నడకయే హెచ్చుతగ్గుగనుండు
కష్టంపు టల్లికగలది యెద్ది
దూరాన్వయంబులం దోరమై యెయ్యది
దుర్భేద్య యగుచుఁదాఁ దోఁచుచుండు

అజ్ఞతతి భ్రమించి యర్థంబుదా వ్యర్థ
పఱచు దేని కట్టి పాడుశైలి
అస్మదుక్తి కేడ నభ్యాసమానోయం
చధికభయముఁగలుగు నకట ! నాకు. 16

సీ. వర్ణింపఁబడి భగవత్పాదసంజ్ఞుఁడౌ
అల మహేశుం డెందుఁ జెలఁగు మిగుల
రహి శాంతిసంజ్ఞికరసమ యెచ్చోటను
తా మొట్టమొదటిదై తనరుచుండు
అక్కడక్కడ దేన నద్భుతశృంగార
కరుణాదిరసములు గలిగియుండు
ఎచట ననాదియై యెసఁగునట్టి యవిద్య
పెళ్ళునఁ గూలుటే పెద్దఫలము
అట్టికృతిని రచించుచున్నట్టి దిట్ట
ధన్యుఁ డీకవి. మఱియు సన్మాన్యుఁ డెందు.
ఈకృతింగల సారస్య మెఱిఁగి తనియు
వారలును ధన్యులగుదురు వసుధలోన. 17

— ♦ దేవతలు కైలాసమునకుఁ బోవుట ♦ —

చం. జగముల మూఁట సంతతముఁ జాలకృపామతి సంచరించుచున్
మిగిలెడి నారదాఖ్యముని మేదిని కొక్కెడ నేగుదేరఁగా
అగుపడె నాగమోక్తవిధు లాదృతి సల్పుచు వేదబాహ్యమై
నెగడెడి నాల్గువర్ణముల నీచజనవ్రజ. మంతఁ జెచ్చెరన్ 18

కం. చని బ్రహ్మకడకుఁ దన్మని
వినిపించి యుదంతమంత విధుశేఖరుఁ డీ
పనికిఁ బ్రతిక్రియసలిపెడు
వెనుదీయక చనుమటంచుఁ బ్రేరేపింపన్. 19

తే. కదలి పురుహూతముఖ్యులఁ గలసి యతఁడు
తీవిఁ గైలాసగిరినుండు దేవదేవు
నొగిసమీపించె నుదయాద్రినొప్పు చంద్ర
బింబముం బ్రీతిమై సమీపించినటుల. 20

వ. ఇట్లు సమీపించి తత్సదాశివముఖపంకజంబు నిజాగమనప్రసన్నం
బగుటంజేసి యభిమతార్థసిద్ధి యగుట యూహించి నమస్కరించి
ముకుళితకరకమలుండై యిట్లు విన్నవించె. 21

తే. ఆర్య! మా మేలుగోరి జనార్దనుండు
మోసపుచ్చుచు బౌద్ధసమూహములను
తాను బుద్ధశరీరంబు దాల్చియుండు
టెల్ల విజ్ఞాతమే భవద్హృదయమునకు. 22

సీ. అరయంగఁ బూర్వమం దస్మద్ధితార్థంబె
వంచించె దైత్యుల వనజనయనుఁ.
డైనను దద్రచితాగమంబులె ప్రబ
లాధారముగఁ గొంచు నధికనియతి
కర్మాదికంబులఁ గడుఁ బ్రబలిపాదించు
శాస్త్రంబు నిందింపసాగి మిగుల
వ్యాపించినారు తద్వసుమతీభాగంబు
బహుళదుర్మార్గులై బౌద్ధజనులు
రాత్రిభాగమెల్ల రహి నంధకారంబు
కరము వ్యాప్తమైన తెరువుదోఁప.
ప్రభుఁడ వీవె వారి బల్మిమై మాయింప
కమలహితుఁడు గాఢతమముమాడ్కి. 23

తే. బ్రహ్మవిద్వేషులై నిందపాలుసేసి
రలఘు వర్ణాశ్రమాచారములనుగూడ.
ప్రభువరా! తిట్టసాగిరి ప్రబలి శ్రుతులు
బ్రతుకు దెరువుగఁ గల్పింపఁబడినవనుచు. 24

కం. ఒకఁడేని సన్న్యసింపం
డొకఁడేనియు సంధ్యవార్వఁ డొక్కెడనేనిన్
సకలజనుల్ పాషండత
సుకముగఁ జేకొనిరి యెంతచోద్యమొ వింటే? 25

కం. క్రతురూపాక్షరయుగళము
క్షితి వినఁబడ మాసికొంద్రు చెవులన్ మనుజుల్.
క్రతువు లిఁకెట్టుల జరుగును?
క్రతుభుజు లనుమాట యెటులఁగలుగును మాకున్? 26

# సహాయులు

౧ మెదక్ కిషన్ రావు దేశముఖుగారు, నల్లపల్లి.

౨ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.

౩ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణము, దుగ్గిరాల.

౪ తిరుమలనల్లాన్ చక్రవర్తివరదాచార్యుల అయ్యవార్లంగారు, శాతాపురము.

౫ రాయచూరి బండేరావుగారు, అయినాపురము.

౬ రాజా మంత్రిప్రెగడ రాఘవరావుగారు - లింగగిరి.

౭ చిక్కరాజు మట్టపల్లిరావుగారు - చెలకుర్తి.

౮ నాదరగుల్ సంగమేశ్వరరావు దే॥ గారు శ్రీశ్రీ జగద్గురు పుష్పగిరి సంస్థానపు ఏజంటు.

౯ అద్దంకి ... తిరువేంగడతాత దేశికాచార్యులయ్యవార్లంగారు. తక్కెళ్ళపాడు.

౧౦ మియ్యాపురం రామకృష్ణారావుగారు, కొల్లాపురం.

౧౧ మల్లాది నరసింహమూర్తిగారు, ప్లీడరు, గురజాల.

౧౨ కురికాల వెంకటేశ్వరరావు దేశముఖుగారు, పులిగెళ్ళ.

౧౩ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావుగారు, లింగగిరి.

౧౪ జింకా వెంకటసుబ్బారావుగారు, వకీలు, గురజాల.

౧౫ వద్దిరాజు సత్యనారాయణరావు దేశపాండ్యాగారు, మేడిపల్లి.

౧౬ గొట్టిపర్తి సుబ్బారావుగారు, వకీలు, సింగరేణికాలరీసు.

౧౭ మారేపల్లి వెంకటకిషన్ రావు, మాధవరావు దేశముఖుగార్లు కాకర్లపల్లి.

౧౮ దంటు లక్ష్మీనరసింహముగారు - సుద్దపల్లి.

౧౯ ముద్దుసాని సాంబయ్యగారు - పొగాకుకంపెని - పరుచూరు.

౨౦ ముద్దు చంద్రయ్య, మారేపల్లి మారుతిరావు దేశముఖుగార్లు కొత్తపల్లి.

౨౧ రాయప్రోలు సుబ్బారావుగారు, ప్రొఫెసర్, యూనివర్సిటీ కాలేజి, హైదరాబాదు.

౨౨ పెసర వెంకటరెడ్డి దేశముఖుగారు, పుల్లారెడ్డిపల్లె.

౨౩ గడ్డం వెంకటనరసింహారెడ్డి దేశముఖుగారు, చెలుకుపల్లి.

# అభినవ సరస్వతి

సంపాదకుఁడు — నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శనము
లును వ్యాసములును బ్రకటింపఁబడును. చందా సం॥ 1 కి రు 3-0-0

ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 విరూపాక్షపీఠగురుపరంపర | ... | 0 | 2 | 0 |
| 2 నీతిగీతలు (సుమతిశతకము, దానిశ్లోకములు) | ... | 0 | 2 | 0 |
| 3 వాసంతికాపరిణయ నాటకము | ... | 0 | 4 | 0 |
| 4 కరిణీకోద్ధారిణి [ప్రాచీనప్రబంధము] | ... | 0 | 4 | 0 |
| 5 విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | | 0 | 2 | 0 |
| 6 వత్సలనీతిశతకము | ... | 0 | 1 | 0 |
| 7 నర్సారావుపేట శతావధానము (తిరుపతివేంకటీయము) | | 0 | 3 | 0 |
| 8 సంగదోషము | ... | 0 | 3 | 0 |
| 9 పశ్యశబ్దవిచారము | ... | 0 | 2 | 0 |
| 10 పురశ్చరణము | ... | 0 | 2 | 0 |
| 11 విగ్రహారాధన ఖండనఖండనము | ... | 0 | 4 | 0 |
| 12 స్వర్ణకారవ్యవహారము | ... | 1 | 8 | 0 |
| 13 శుద్ధాంధ్రహరిశ్చంద్ర చరిత్రము | ... | 0 | 10 | 0 |
| 14 సూతసంహిత (ఆంధ్రము) | ... | 2 | 0 | 0 |
| 15 భారతీయప్రబోధము (పిసుపాటి చిదంబరశాస్త్రి) | | 0 | 4 | 0 |
| 16 ధర్మనిర్ణయము | ... | 0 | 4 | 0 |
| 17 అస్పృశ్యతానివారణఖండనము(మల్లాది రామకృష్ణచయనులుగారు) | | 0 | 8 | 0 |
| 18 స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండము (౧ సంపుటము) | | 1 | 0 | 0 |
| 19 టో నాగరఖండము (౨ సంపుటము) | | 1 | 8 | 0 |
| 20 డిటో నాగరఖండము (౩ సంపుటము) | | 1 | 8 | 0 |
| 21 డిటో నాగరఖండము (౪ సంపుటము) | | 1 | 8 | 0 |
| 22 పల్నాటివీరచరిత్ర | | 0 | 12 | 0 |
| 23 ఆరోగ్యభాస్కరము | | 0 | 6 | 0 |
| 24 భాగవతరహస్యములు | | 0 | 4 | 0 |
| 25 సోమేశ్వరశతకము | | 0 | 2 | 0 |
| 26 జాతకచర్య (స్వకీయులచరిత్ర) | | 1 | 8 | 0 |

అభినవసరస్వతీ కార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్లపోస్టు,
గుంటూరు జిల్లా.